# PHOTOGRAPH.



# ఛాయాపత్రము





కాశకులు,

టి ధనరాజు.

రాజమండ్రి.

1926

న్న్యయాగ్రంథమాలా 1

# ఛాయాపత్రము

"THE PHOTOGRAPH"

నూతన కథావిధానముగల అద్భుత

నిగూపక నవల

---

(DETECTIVE NOVEL.)

బరంపురవాస్తవ్యులును, "వైకుంఠమత", "కామాక్షీసరసా"ది

గ్రంథకర్తలగు

మండ వెంకటేశముగారి

ప్రణీతము.

---

మొదటికూర్పు 1000

పబ్లిషర్సు

ప్రగళ్ళపాటి ధనరాజు

రాజమహేంద్రవరము.

1926



[వెల 0—6—0.

శ్రీరామచంద్రాయనమః

# ఛాయాపరము.

## మొదటి ప్రకరణము.

—: ❦ :—

"నేటిరాత్రి యెనిమిది గంటలకు నొకవ్యక్తి యత్యావసరమగు నొక రహస్యవిషయముఁగూర్చి మీతోఁ బ్రసంగింపరానున్నాఁడు. కొలఁది దినములకుఁ బూర్వము మీ రొక రాజవంశీయునకుఁ జేసిన సాహాయ్యమాతని కానందదాయకమగుటఁ జేసి, లోకమున విశ్వసింపఁదగినవారును, విషమావస్థలో నాపద్బాంధవులై కాపాడఁదగినవారును మీరొకరేయని సంపూర్ణముగ నమ్మి మీకీయుత్తరము వ్రాయఁబడినది. మీకీర్తి దిగంతములఁ బ్రాకి మాపీనుల దాకినది. తప్పకుండ మీరప్పటి కింటనుండవలెను. ఈ లేఖావహకుఁడు కవచధారియై, ముసుంగున నుండును. అంతమాత్రమున మీరనుమానింపవలదు."…………………తేదియు, సంతకము, మఱియు బైవిలాసమును లేక సంశయాస్పదముగ వ్రాయఁబడిన యీలేఖ, మననిరూపక చక్రవర్తియగు రామారావు తనయలవాటు చొప్పున యథాప్రకారము సాయంతనమున షికారు వెడలి, తిరుగ తనకచేరీగదిలోఁ జేరుసరికి, మేజాబల్లపై

నుంచఁబడెను. నిరూపక కార్యములయందు శ్రద్ధాబుద్ధి, మిక్కిలి యుత్సాహముతోఁ బనిచేయుచుండిన, మిత్రుఁడగు కృష్ణారావు సహితము వెంటనుండెను. వారిరువురు నేదియో యొక లోకాభిరామాయణము ముచ్చటించుకొనుచు వివిధాంశములఁ జర్చించుచు, ప్రకృతితత్వముఁ గూర్చియు, సామాన్య దినచర్యలఁగూర్చియు, బరిశోధనాద్వ్యాఖ్యలతో గమనించుచు వచ్చి, నిరూపకునిగదిఁ బ్రవేశించిరి. అంతనే రామారావు దృష్టి మేజాబల్లపై, నింతకుముందే యుంచఁబడిన యాలేఖ పైఁబడ, నది చేఁబూని, చదివి, మందహాసముఁ జేసి, కృష్ణారావున కందిచ్చెను.

జ్ఞానమువచ్చినది మొదలు, నిరూపకునితో మెలంగుచుఁ దత్కార్యములయందు బాధ్యతవహించుచు, విషయనిర్ధారణ కలవాటుపడిన యాకృష్ణారావు సామాన్యుఁడు గాడు. కాని యాకార్యముపట్టున, నట్టిన విలువ లేకపోయెను. లేఖ నామూలాగ్రముగఁ బఠించి, విషయాద్భుతమునకును, సంతకము, పైవిలాసము లేమికిని, యాశ్చర్యముఁ బొంది, హాస్యదృక్కుల నిరూపకునిఁ జూచుచుండెను. ఇంతలో సేవకుఁ డొకఁడువచ్చి, చేతులొగ్గి, "అయ్యా! యువకుఁడొకఁడు విచ్చేసి, రామారావుగారున్నారాయనియు, సాయంతన మేడుగంటలు దాటకుండ నింటికి వత్తురాయనియు, నడిగి, సదుత్తరములు రా మీరు వ్రాయుచున్న యాలేఖను మాకందజేయఁగోరి, తన

దారిం ద్రాంబోయెను." అని చెప్పి యచ్చట వేచియున్న యా సేవకునింజూచి "సరే నీవింక పోవచ్చు" నని నిరూపకుండు రామారావు మార్వెల్క్కను. ఇంతదనుక, నేమియో, మౌనముందాల్చి, దీర్ఘాలోచనలోంబడియున్న కృష్ణారావు, రామారావు, విషయమును చర్చింపందొడంగిరి :—

కృష్ణా—అయ్యా, ఇది చాలా యద్భుతముగానున్నదే. మీరే మియూహించిరి.

రామా—నేనేమియు, నిప్పుడిదమిద్ధమని చెప్పంజాలను. ఇంతకు తగినంత సిద్ధాంతము లేనిదే, యనేక వాదములు, నూహలు, సరిచూంచుకొనుట గొప్పతప్పు. ఇప్పుడీ లేఖవలనందేలిన సారాంశమేమి ?

కృష్ణా—చేవ్రాలును, కాగితమును, సూక్ష్మదృష్టితో బరీక్షించితిని. ఈలేఖ వ్రాసిన వ్యక్తి యొకధనికుండని యూహింపంగలిగితిని. ఏలయన, ఈరీతికాగితములు 50 గల పేకెట్టు, 1కి 3రూ॥ విలువకు తగ్గదు. కాగితముచుట్టును బంగారు గిల్టున్నది. ఇంతేకాక, కాగితము విచిత్రముగా, నాకుం గన్పట్టుచున్నది.

రామా—ఆం చిక్కంతయు నందులోనేయున్నది. ఏదీ దీపకాంతిలో నాకాగితముం జూపుము. (అని యాకాగితముం బరికించి) మిత్రమా! చూచితివా? ఈకాగితము బజారున సర్వసామాన్యముగ దొరకునదిగాదు కాగితము గుర్తు

బట్టి బవేరియాదేశమునఁ దయారైనట్లు స్పష్టమగుచున్నది. మఱియు, నియ్యది వ్రాసినవ్యక్తి, యొకరాజుగా భావింపవలసి యున్నది. లోకమున, నెట్టివారైన తమస్థితిగతులకు ననుకూలించు వారితో, నుపమింపుకొనుచుందురు. అనఁగా, స్త్రీలు, స్త్రీలను, పురుషులు పురుషులను, రాజులు, రాజులను, సామ్యముగఁ జెప్పుకొనుట స్వభావసిద్ధమైయున్నది. మఱియు నీయంశము నాయనుభవసిద్ధము. ఇంతేకాక, నేనొక రాజవంశీయునకే సాయముఁజేసితినా? తక్కుంగలవారల నెందఱికి, నెన్నివిధములఁ దోడ్పడలేదు- మఱియు, లేఖావాక్యములు కొన్ని, యాజ్ఞాసూచకములుగ నున్నవి. ఈ హేతువులఁబట్టి యాలోచింపగాఁ నీలేఖ, యొకరాజుగాని, తత్తుల్యుఁడగు నొక ధనికుఁడుగాని వ్రాసియుండును.

అని వారిరువురు సంభాషించుకొనుచుండగనే వాకిట గుఱ్ఱపుడెక్కలసవ్వడి వినవచ్చెను. అంత రామారావు తన చేతి గడియారముఁజూచి, కృష్ణారావుతో మిన్నకుండుమని చేసంజ్ఞఁ జేసెను.

—శకటము భవనముముంగిట నిలువఁబడెను—

కృష్ణారావు—అయ్యా! నేనిప్పుడీస్థలముఁ బాసి వెడలుట యుచితమని తోచుచున్నది.

రామా—ఎంతమాత్రము వలదు. ఇయ్యది చాల చిత్రమైన కేసువలెఁ దోచుచున్నది. తప్పక యీవిషయమై

పనిచేసి విశేషాంశములు గమనింపకుండుట నీదురదృష్టమని తలంచెదను.

కృష్ణా—ఔఁగాక. ఆరాఁబోవు వ్యక్తి..............

రామా—భయములేదు. వచ్చుచున్నాఁడు ఈకుర్చీపైఁగూర్చుండి నీవు మిక్కిలి మెలఁకువతో గమనింపుము.

ఇట్లింతలోనొకవ్యక్తి ఆయిదడుగుల యారంగుళముల పొడవు గలిగి, నల్లని పట్టుతో తయారైన దుస్తులధరించి, చేతనొక విలాసదండముఁబూని అద్దములవలెఁ దళతళ మెఱయు నల్లని చెప్పులఁ దొడిగి, నడకయందు సహజమగు ఠీవిఁ జూపుచు మెలమెల్లన గదిలోన కేతెంచెను. ముఖమును, కనులను మున్నగు నవయవస్ఫూర్తి వర్ణించుటకు ముసుగొకటి యడ్డులేకున్నఁ దగినంత యవకాశము చిక్కియుండును గాని యట్టిసౌకర్యములు నస్మలకుఁ జిక్కకుండఁ జేసినను గ్రంథకర్తకునైన నట్టి యవకాశ మీయకున్నందులకు నాతని నేమనవలెనో పాఠకమహాశయులే యెఱుంగుదురుగాక. అంత నాగంతకునకు, మన నిరూపులకే క్రిందివిధమున సంభాషణ జరిగెను.

వ్యక్తి—"అయ్యా! నాలేఖ మీకీపాటికిఁ జేరియేయుండును. నేటిరేయి ఎనిమిదిగంటలకు వచ్చెదనని వ్రాసితినిగదా" (అని యిరువురఁజూచి పలికి మిన్నకుండెను).

రామా—ఔను తమరీ యాసన మలంకరింపవచ్చును. ఈతఁడు నా ప్రాణస్నేహితుఁడు. నా నిరూపక కార్యములలో నాకు కుడిభుజమువలె నుండువాఁడు. సరే! మిమ్ము నేనేమని సంబోధింపవలెనో తెలియకున్నది.

వ్యక్తి—ప్రస్తుతము మీరు నన్ను కుమారచంద్ గా సంబోధింపవచ్చును. ఈ మిత్రులు విశ్వాసపాత్రులను ధైర్యము మీకున్న బహిరంగముగఁ ప్రసంగింప వెనుదీయము.

అప్పలుకులు వీనులఁ బడినయంతనే కృష్ణారావు లేవఁ బోవుచుండ నిరూపకుఁ డాతని కూర్చుండఁబెట్టి కుమారచంద్రుపైఁ జూడ్కుల నిగిడించి, "అయ్యా! మీరు నాతో నేయేవిషయముల మాటాడవచ్చితిరో ఆయంశముల నిస్సందేహముగ, నా యొక్కనితోడనే మాటాడుచున్నట్లు భావించి ప్రసంగింపవచ్చును.

వ్యక్తి—సరియే. ఉపక్రమింపవచ్చునా?

నిరూ—చిత్తము. శ్రీవారి కభ్యంతరమేమి?

వ్యక్తి—మీ రిరువురు, నా యీ చెప్పఁబోవునది రెండు సంవత్సరముల పర్యంతము రహస్యముగఁ గాపాడవలెను. ఆపై నట్టియవసరమే యుండదు.

నిరూ—అటులనే.

వ్యక్తి—నా యీయవకుంఠనమునకు క్షమింపఁగోరెద. మా యధికారి తనదూత యితరులకంటఁబడకుండుటకుఁగా,

నన్నిట్లు పోనాజ్ఞాపించెను. మఱియు నేనిప్పుడు చెప్పిన నాను మును సాంకేతికమని గ్రహించియేయుందురు.

నిరూ — నే నెఱుంగుదును.

వ్యక్తి — నేనిప్పుడు చెప్పఁబోవునది యతిగూఢమైనదియు నొకింత వెలువడెనేని, నొకానొక రాజకుటుంబమునకు హానివచ్చుననియు నెఱుంగఁగోరెదను.

నిరూ — ఔను. (కనులొకింత మోడ్చి తిరుగఁదెఱచి) రాజుగారా! గూఢవిషయమని, తమరతిగూఢముగ మాటాడిన, మాకుఁ గష్టముగనేయుండును. సర్వము నిస్సందేహముగ మాకుఁ దెలిపిననేగాని, నేనిప్పట్టున, మీకెట్టిసలహాయు నీయఁజాలను.

నిరూపకునిపై ప్రసంగము నాలకించినవెంటనే, యా నూతనవ్యక్తి, కుర్చీనుండి శీఘ్రముగ లేచి, భరింపరాని యాందోళనతో, ముఖముఁ జిట్లించికొనుచు, నిటునటు నొకమారు తిరిగి, తుదకేమియుఁదోపక, తనముసుఁగుఁ జించి గిరగిరఁ ద్రిప్పి నేలఁగొట్టి, "ఔను. మీరన్నది నిశ్చయమే. నేను మహారాజునే. మీయొద్ద దాచనేల? "హనుమంతుని ముందఱ గుప్పిగంతులా" యని పలికి మందహాసముఁజేయుచు యథాప్రకారముఁ గుర్చీపైఁ గూర్చుండెను.

నిరూ — సూరత్ దేశాధీశులై యుందురా?

రాజు — ఔను. నే నిట్టికార్యముల కలవాటుపడినవా

డనుగాను. మఱియు, మీతోఁ బ్రసంగింపనుద్దేశించి, నన్నుఁ బోల్పఁజాలరను నమ్మకమున స్వయముగ వచ్చితిని. నేవచ్చిన కార్యముఁగూర్చి యించుకశ్రద్ధవహించి యాలింపుడు. నేను దేశాటనముఁ గావించునప్పుడు, ఆగ్రాయందు, మోహినియను నొక జగన్మోహినిని వలచియుంటిని. ఆమెను మీ రెఱింగియే యుందురు.

రామారావు కృష్ణారావుఁజూచి "నానిరూపకగ్రంథ సర్వస్వమును చూడవలెను." అని యన్నంతనే కృష్ణారావు లేచి యాగ్రంథముఁదెచ్చి చేతికందిచ్చెను నిరూపకుఁడాపుస్తకమును చేఁబూని చూచుచుండెను. అందొకచో నిట్లు వ్రాయఁబడియుండెను- "మోహిని—జననము 1898. రాజా రామకుమారుఁడు—ఉనికి — ఆగ్రా— అవివాహిత. సూరత్ దేశాధీశునితో స్నేహముఁజేసినది రాజుగారు, కొన్నివాగ్దానములుగల లేఖల వ్రాసియున్నారు." అని చదివి, రాజుదెసఁ గాంచి, "చిత్తగింపుడు. ఇపుడు మీకా లేఖలతోఁ బనియున్నదా ? తిరుగ సంపాదింపఁగోరెదరా ?

రాజు—అవును. ఎట్లు సంపాదింపనగును ?

నిరూ—రహస్యవివాహము జరగినదా యేమి?

రాజు—లేదు.

నిరూ—సర్టిఫికెట్లు గాని కోర్టునిదర్శనములు గాని యున్నవా ?

రాజు—లేవు.

నిరూ—అయిన, నిప్పుడు మీకువచ్చిన హానియేమి?

రాజు—నాపై బగసాధింపఁ జూచుచున్నది.

నిరూ—అది ఆమెకెట్లు వలనుపడును.

రాజు—చేవ్రాలున్నదిగదాయని భయపడుచున్నాను.

నిరూ—ఊఁ—ఫోర్జరీ....

రాజు—నాసొంతకాగితము....

నిరూ—దొంగిలించినది—

రాజు—నాసొంతసీలు—

నిరూ—అనుకరించెననవచ్చు.

రాజు—నాఫోటో....

నిరూ—క్రయమునకుఁ గొనియుండరాదా?

రాజు—మేమిరువురము నందున్నాముగదా!

నిరూ—ఆఁ....గట్టిచిక్కే....

రాజు—నేనప్పు డున్మత్తుఁడనై యుంటిని. అంతటితో సరిపోయినదా? మఱియు యువరాజపదవిలో నుంటిని.

నిరూ—ఇప్పుడది సంపాదింపవలెననా మీ ప్రయత్నము?

రాజు—అవును. నేను ప్రయత్నించి విఫలమనోరథుఁడనైతిని.

నిరూ—తిరుగ దానిసంపాదించుటకుఁ గొంత వెచ్చింప వలెను.

రాజు—ఆమె విక్రయింపదే- ఎట్లు ?

నిరూ—దొంగిలింపవలెను.

రాజు—ఇదివఱ కట్టిప్రయత్నము రెండుసారులైనది- తుదకు లాభములేకపోయినది.

నిరూ—ఏమి ? అట్టియవకాశమే లేకపోయెనా!

రాజు—ఇంచుకంతయు లేకపోయెను.

అంత నిరూపకశిఖామణియగు రామారావించుకతడ వాలోచించి, మందహాసముఁజేసి "సరియే. దీనికింతచర్చ యేల! ఇది చిన్నపని.

రాజు—మీకీపని స్వల్పముగఁ గన్పట్టవచ్చుఁగాని మాకది మహామేరువువలె నున్నది.

నిరూ—అట్లనా? ఆమె యాఛాయాపట్టముతో నేమి చేయఁదలఁచినది.

రాజు—నన్ను బయలుపెట్టి యిప్పటినాకార్యమునకు భంగమాపాదింప సమకట్టినది.

నిరూ— అది యెట్లు

రాజు —నేనిప్పుడు పెండ్లికొమరుఁడనై యున్నాను గదా !

నిరూ—అవును. అటులనే వింటిని.

రాజు—నైజాము రాజుగారి తెండవకుమారిని నాకిచ్చుటకుఁ బ్రయత్నములు జరగుచున్నవి. ఆరాజకుటుంబమునకుఁ గల గౌరవాగౌరవములఁగూర్చి మీకు నేఁ జెప్పనక్కఱలేదు. ఆమె సౌందర్యముఁగూర్చి గాని, గుణములఁగూర్చిగాని నేఁ జెప్పుటకుఁ జాలను ఆకారణమున, నాప్రవర్తనయందావగింజంతదోసము బయల్పడిన, నాప్రయత్నమంతయు వ్యర్థమగునుగదా ?

నిరూ—అయిన—మోహిని....

రాజు—ఆఛాయాపటము నామెయొద్దకుఁ బంపి నాకు విఘ్నముఁదెచ్చి పెట్టుటకు మోహిని సంసిద్ధురాలైనది. మీదు మిక్కిలి నన్నుఁ దాటించుచున్నది. ఈదుష్టురాలు తప్పకుండ నన్నుఁ జిక్కులలోఁ బెట్టి పాడుచేయును. మీరెఱుఁగరు. స్వభావసిద్ధముగ నసూయాపరిభావమున స్త్రీలెంతకైన జంతలు. అందు మోహినిఁగూర్చి చెప్పవలసినదేమున్నది. పాషాణమునకునైన నించుక మార్దవమున్న నుండునేమోగాని యామె హృదయమున కుండదు. నే నింకొకస్త్రీ చెలిమిజేయ నామెచూచి సహించునా ? ఎంతకైన సాహసించితీఱును.

నిరూ—ఆమె యిప్పటికింకను పంపలేదని నిశ్చయింపఁగలరా ?

రాజు—మీధర్మమాయని యిప్పటికింకను పంపలేదు.

నిరూ—ఎట్లు నిశ్చయింపఁగలరు ?

రాజు—ప్రధానదినమునాటికిఁ బంపెదనని యన్నది. ప్రధానము రాఁబోవు గురువారము. పీటలమీఁది పెండ్లి పాడు గాకుండఁ బుణ్యముఁగట్టుకొనుఁడు.

నిరూ—అటులనా. మఱి చెప్ప శేమి? నేటికి మూఁడు దినములు వ్యవధియున్నదిగదా? మీరదృష్టవంతులే. నేనిప్పుడే, యత్యవసరములగు మూఁడు కార్యములయందు నిమగ్నుఁడనైయున్నాను. మీరిప్పుడు వేగముగవచ్చి యెఱింగించుట చాల మేలైనది. శ్రీవారిప్పుడు వెంటనే కాశిఁజేరుకొనుట యత్యుత్తమము. కానిచోఁ గార్యసాధన కనేకాంతరాయములుండవచ్చును.

రాజు—అటులనే కానిండు. కాశిలో బజారువీధియందు 73 నెంబరుగల యింటియందుండును. కుమారచందను పేరఁ మెలంగుచుండును.

నిరూ—నాప్రయత్నము లెప్పటికప్పుడు మీకుఁ దెలియుచుండును.

రాజు—మీచిత్తము. నేను మిక్కిలి యాతురతతో నున్నాను.

నిరూ—నే నెఱుంగుదును. మీరీవిషయమై కొంత పఱకు ధనము వ్యయము చేయవలసియుండును.

రాజు—అభ్యంతరమేమి? మీయిష్టము.

నిరూ—అటుగాదు, కొంత నియమించుకొనవలెను.

రాజు—నా రాజధానిలో 8వ వంతు మీది. ప్రస్తుతము కావలసిన వెచ్చములకు రూ 700 నోట్లున్నవి. స్వీకరించి కార్యమునకుఁ బూనుకొనుఁడు.

అంత రామారావారూప్యములఁ బరిగ్రహించి రసీదు వ్రాసియిచ్చి "ఆమె యిప్పటి పైవిలాసము చెప్పఁగలరా" యని ప్రశ్నించెను.

రాజు—మోహిని. 330 నెంబరు. రాజవీధి-ఆగ్రా. నిరూపకుఁడా పైవిలాసమును తననోటుబుక్కులో వ్రాసికొని "అమ్మాయి-మతియొకప్రశ్న- ఫోటోగ్రాఫ్, క్యాబినెటు సైజుగా నుండునా? అని ప్రశ్నించెను.

రాజు—అవును.

నిరూ—మంచిది. మాకిఁక సెలవిండు. కొలఁదిదినములలోనే, శుభవర్తమానము తెలియఁగలదు.

మంచిదని రాజుగారు లేచి నిలువఁబడి, పైకివచ్చి; గుఱ్ఱముబండి పైనెక్కి తనవారిఁ దాఁబోయెను రామారావు కృష్ణారావుఁజూచి "రేపు మూఁడుగంటలకు మనమీవిషయము మెముచ్చటింపవచ్చును. నే నిందుఁగూర్చి యాలోచింపఁ గొంతకాలము వెచ్చింపవలెను.



# ఛాయాపరము

—: ✻ :—

## రెండవ ప్రకరణము.

—:(o):—

ఆగ్రాపట్టణవీథు లన్నింటియందును విశాలమై మిగుల శోభాయమానముగ వెలుంగుచున్న యొక్క రాజవీథినిమాత్ర మిట నించుక వర్ణింపవలసియున్నది. నడువేసంగియందు సయితము, బాటసారు లెట్టియిక్కట్టులకు గుందకుండను, సూర్య రశ్మి సోకకుండునటులను, వీథి కిరుపక్కలందును మహావృక్షములు నాటబడియుండెను. ప్రయాణికులు తమబడలికదీర్చు కొనుటకుగాను అందందు చిన్నచిన్నమండపములును అందుపై పరిమళతావుల జిమ్ముచున్న గులాబి మొదలగు చెట్లును, గలిగి ఆవీథి నేత్రానంద మొనర్చుచుండెను. ఆరాజవీథి దివ్యోన్నతసౌధములచే నలరారుచు, అందందు నెలకొల్పబడిన విద్యుద్దీపకాంతులవలన నతిభయంకరమగు అమవసనిశికూడ పూర్ణిమబోలి, శోభిల్లుచుండెను. పగటియందెంత జనసమ్మర్థముండునో, రాత్రియందును నించుమించంత జనసమ్మర్థముండునని చెప్పవచ్చును. వచ్చుచు పోవుచున్న మోటారులకును గుఱ్ఱపుబగ్గీలకును లెక్కయేలేదు. మోటారు ముప్పుగుబండ్లుపోవుట కొకదారి. జనులు కాలినడకను సంచారమొ

వచ్చుట కింకొకమార్గము. బాటసారుల కెట్టియపాయ మే క్షణమున సంభవించునో యని రక్షకభటులు వచ్చుబండ్లకును, పోవువానికిని సరియగు చేసన్నల జేయుచు అప్రమత్తులై మెలంగుచుండిరి. ఈవీధి కిరుప్రక్కలయందును ఎత్తయిన 660 మేడలు గలవు. ఇందు ఉత్తరవాసయందున్న తుదిమేడ నాల్గంతస్థులు గలిగి, నూతనకుసుమవృక్షవిలసిత చిత్రితమై నానావిధరూపశోభితమై యుండెను. వేసంగియగుటను వట్టి వేళ్లచాపలుకూడ, చల్లదనమువకై వ్రేలాడగట్టబడియుండెను. ఈమేడ వెనుకభాగమున చక్కని చిన్నయుద్యానవన మొకటి గలదు. ఈవనము భవనాధికారి సర్వసాధారణముగ విశ్రాంతి గొనుటకు నిర్మింపబడినదానింబలె దోచును.

ఒకనాటి సంధ్యాసమయమున గుఱ్ఱపువాడొక డతి మందముగ నడచుచు నావీధివెంబడిని నడచిపోవుచు, తుద కీమేడపై 330 నెంబరు వేయబడియుండుటంగాంచి నట నిలువబడియెను. తోడనే ఆభవనద్వారమునకు తాళము వేయబడి యుంటంగాంచి, చేరువనున్న గవాక్షము దరిజేరి లోనికి పరికించుచుండెను. ఈవ్యక్తి కొంతసేపటికి నిలువబడి మరల బాటకువచ్చి యిటునటు జూచుచుండెను. అంత నొకగుఱ్ఱపుశాల నాతని దృష్టిపథమున బడ నచ్చటి కేగెను. కొందఱు కూలీలట, కొన్నిగుఱ్ఱములను పట్టుకొని, సాపుచేయుచు, నేమేమో మాటలాడుకొనుచుండిరి. ఈగుఱ్ఱపువాడు సయిత మా-

వారికి యించుక చేయూతనొసగి 330 నెంబరు మేడ వృత్తాంతము మధ్యమధ్య వారి నడుగుచు వారివలన మోహినివృత్తాంతము ఉనికి మున్నగువిషయముల దెలసికొనియెను గాని, మోహిని తలిదండ్రులెవరో, ఎందుండి ఆమె యిటకువచ్చెనో ఒంటరిగ నీసౌధమలంకరించుటకు గతంబెయ్యదియో, తెలసి కొనజాలకపోయెను.

మోహిని నిజముగ జగన్మోహిని యన నతిశయోక్తి కానేరదు. జంగమ హేమవల్లి సుప్రసిద్ధ గాయకురాలు. ప్రతి దినమును వేకువనే నిలువీడి తిరుగ భోజనసమయమునకే నిలు చేరుచుండును. సంగీతవిద్వత్పరీక్షకై నెవ్వరైన ఆహ్వానించి నప్పుడేగాని తరచుగ నామె గ్రామము వీడిపోవుట లేదు. నల్లని దీర్ఘకాయు డొకడామెగృహము నిత్యము రెండుపర్యాయ ములు పావనముచేయుచుండెను ఈవ్యక్తి "సూరిదాసు"పేర వ్యవహరించుచుండెడువాడు. ఈసమాచారమంతయు తదితర గుఱ్ఱపుకాపరులవల్ల గ్రహించి నచ్చట వీడి యొకయేకాంత స్థలమునకేగి తనకార్యమును నిట్లు వితర్కించుకొనుచుండెను.

సూరిదాసు డీమెభవనమునకు రాబనియేమి? సూరి దాసు డొకన్యాయవాదియై యుండనోపు. ఇదియే నిజమైన మోహిని యాతని కక్షిదారురాలుయై యుండునా - లేక యామె యాతని బంధుగురాలా? లేక భార్యయా? ఈనూ టియుగిదును వీరియిరువురకు మొదటిసంబంధమే యుండెనా,

తప్పక నాఛాయాపట మాతని కిదివరకే జేరియుండును. తుది రెండుసంబంధములుండిన నట్టి అవసరము గాన్పించదు. ఇట్టి యెడ నెయ్యది ఆచరణీయము. అనుచు తలంచికొనుచుండగనే గుఱ్ఱపుబగ్గీయొకటి యాతెన్నునసే వచ్చెను. అదిచూచి గుఱ్ఱపువా డామోహినియింటిదెస మందముగ బోసాగెను.

ఈశకటమువచ్చి మ్మోహినియింటిముంగల నిలువబడెను. అందుండి నల్లనిపురుషుడొకడు వెలుపలికివచ్చి మోహిని యిలు తాళమువేయబడియుండుటం గాంచి, తటాలున తన చొక్కానుండి వాచీనిజూచి, గుఱ్ఱపువాని బిలచి "ఓయి! మనమిప్పు డిరువదినిముసములలో దేవీమందిరమున కేగవల యు". సమయము మించిపోకుండ, బండి నడపితివేని నీకు మరిచిబహుమానము నిత్తునని చెప్ప, నాతడు వల్లెయని నతి త్వరితముగ గుఱ్ఱముల నదురుచు బండిని పోనిచ్చెను. ఈనా టకమంతయును జూచుచు దవ్వున నిలువబడిన మనగుఱ్ఱపు వాని కేమియుదోపక నటులే నిలువబడియెను. ఇంత వేరొక శకటమువచ్చి పూర్వపురీతినే మోహిని భవనముముంగిట నాగెను. అందుండి కన్నులు మిరుమిట్లుగొలుపు నొక స్త్రీలో కసుందరి, బయలువెడలి, భవనద్వారము దెఱచి లోనికేగి మరల నొకత్రుటికాలమున, వెలుపలకు వచ్చి, యథారీతి తాళ మువేసెను అటుపై శకటము దరిజేరి, నాబండివానితో దేవ మందిరమునకు పదునైదునిముసములలో నీశకటము బోనిచ్చిన

నీకు మంచిబహుమానమిత్తునని వాగ్దానమొనర్చెను. అంత నాసారథి యత్యానందముతో చంకలు గుద్దుకొనుచు, తన పరిజ్ఞయంతయు జూపి, శకటమును వాయువేగమున నడపుకొనుచు పోవుచుండెను. ఇది యంతయు గమనించుచుండిన మన గుఱ్ఱపువానిహృదయము రావియాకుబోలె నల్లలనాడ జొచ్చెను. ఏమిచేయుటకును నాతని కాళ్లాడుటలేదు. గాని ముందేగినవ్యక్తి సూరిదాసుడున్న, ఆతని వెంబడించిన స్త్రీ మోహినిదై యుండుననితలంచి, దేవీమందిరమున వింతశేమయిన నుండవచ్చునని గ్రహించి, ఎట్టి విలంబనము చేయక తక్షణ మామందిరమునకు బోవుటుచితమని నమ్మి వేరొకశకటమును రా నియమించి, తానును పెద్దబహుమానమొకటి యేర్పరిచి, పదినిముసములలో శకటమును దేవీమందిరము జేరవలయునని నాజ్ఞాపించి నచ్చట వీడెను.

ఆగ్రాయందు దేవినవరాత్రుల యుత్సవము చూచితీరవలయునే గాని వర్ణింపనలవికాదు. ఈపురమునకు దక్షిణమున మైలుదూరమున యీయుత్సవమునకుగాను, మందిర మొకటి గట్టబడియుండెను. దీనికే దేవిమందిరమని బిలచుచుందురు. దేవీమహోత్సవదినములలో మందిరమంతయు రుధిరమయమై అతిభయంకరముగ గన్పట్టును. ఈమందిరమునకు చేరువనే యొకచిన్న యుద్యానవనము కలదు. ఇచ్చట పగటిపూటయుంచంతగా జనసంచారముండదు. ఇయ్యది రాత్రుల

యందుమాత్ర మొకింత యలుకను గలిగియుండును. మోహినియు సూరిదాసుడును దేవీమందిర మదివరకే చేరి యుందురని చదువరులకు విదితమే. వీరిరువురును మందిర మును జేరి నచ్చట నెలకొల్పబడియున్న దేవికి నమస్కరించి యుద్యానవనము జొచ్చి నొక యేకాంత ప్రదేశమున గూర్చొని యిట్లు మాటలాడుకొనజొచ్చిరి.

సూరి— మోహినీ! నన్నేల యలజడినొందించెదవు. నీరూపముగాంచి మోహించి మదనుదావాగ్నికి జిక్కియు న్నాను నీకొఱకై పెక్కుశ్రమలుబడుచున్న నన్నికనైన ధన్యుంజేయరాదో? ఏల నన్నింతగా ననుమానించుచుం టివో నాకేమియు బోధ్యము కాలేదు. ఇక కాలయాపన మొనర్పక నీహాగ్దానమిమ్ము. నేను సదా నీకు పదదాసుడనే.

మోహిని— మిమ్ములనే కాదు. నేను పురుషులనే నమ్మ నిశ్చయించుకొనలేదు. అక్కరదీరువరకును తాము వల చుస్త్రీల కెన్నియో ప్రియోక్తుల జెప్పి పేరాశలజూపి, ఆపై స్త్రీలను బానిసలకంటె హీనముగ జూతురు. ఇట్టికార్యముల యందు నేను హతశేషనైయున్నాను. యువరాజుగారు, కొలది దినములలో రాజ్యాభిషిక్తుడై పట్టణము నేలవలసిన వాడు.... అని యింకేమియో చెప్పబోవుచుండగనే సూరిదాసు డామాటల కడ్డువచ్చి—

సూరి—చాలు! చాలు! ప్రపంచమున నందరొకతీరు నేయుందురా? విశ్వాసముగలవారొకరైన నుండరా?

మోహిని—మీరనునది సత్యముగావచ్చును. నైజ గుణము అవస్థాభేదమున కొంక్కొకతరి లోనగుచుండును. వస్తు సముదాయము సూర్యదీప్తియం దెఱుపుగలిగియు, చంద్రకిర ణములు శోకినతోడనే ధవళిమగలిగియుండును. ఇందులకు కారణమేమి.

సూరి—నీవు మాటకారివని నే నెఱుంగుదును. ఇం కను నన్ను నీవచోమాధుర్యముచే వంచనజేయకుము ఇద మిద్ధమ్మని నాకేదియో యొకటి నిర్మోహమాటముగ జెప్ప వలయును.

మోహిని—అట్లయిన వినుడు. నా జీవితకాలము పోషింపనెంచి నన్ను మీరు వివాహమాడినట్లు వ్రాతమూల ముగనుండి రెండుసాక్షిసంతకము లుండవలయును. ఇయ్యది మీకు అంగీకారమగునేని, నాకెట్టి యభ్యంతరమును లేదు,

సూరి—నీ దేవియే సాక్షిగ ప్రమాణముజేసిన చాలునా?

మోహిని—అటుగాదు కలియుగమగుటంజేసి, నియ్యా వి ప్రత్యక్షసాక్ష్యము లిచ్చుటలేదు. గాన యిరువురు సాక్షులుం గావలయును.

సూరి—మోహినీ! నన్ను పరీక్షించుచుంటివా కాని మ్మా- ఈనీయేర్పాటు యింటివద్దనే సెలవిచ్చియుండిన సాక్షుల గొని తెచ్చియుండనా. ఇప్పుడిట నెవ్వరుందురు.

మోహిని—ఏమి? మీరు వ్రాయుట కంగీకరించి మనోవాక్కాయకర్మముల నన్ను జేపట్టసంకల్పమే యుండిన సాక్షులే దొరకరా? దేవియొక్క పూజారి యొకడు. అవ్వలి కేగిన మరియొక్క పెద్దమనిషియే లభింపకుండునా?

సూరి—ఎంతమాటాడితివి. వ్రాయుటకు జంకుచుం టినా యని చొక్కా జేబునుండి కాగితమును కలమును దీసి యొక వాగ్దత్తలేఖ నొకదానిని వ్రాసెను. అందు సూరిదాసు డీమోహినిని దేవీసాక్షిగ బెండిలి జేసికొంటిననియు, తన జీవి తకాలము నామెను బోషించెదననియు, అకారణముగ నామె ను వీడననియు, కారణాంతములచే నట్లు పోషింపక విడిచితినేని యపరాధముక్రింద నామెకు పదివేలరూప్యముల నిచ్చెదన నియు వ్రాసియిచ్చెను.

మోహినియు సూరిదాసుని కలము జేకొని, వేరొక కాగితమున, తానును సూరిదాసుని నాదేవిసాక్షిగ నే బెండ్లి యాడినట్లును తన జీవితకాలము సూరిదాసుని వీడననియు, తనపూచీపై విడువవలసివచ్చిన తనకు రావలసిన పదివేల రూప్యముల కోతననియు వ్రాసి యిచ్చెను. అంత సూరిదా

సుదును మందిరద్వారముదెసకు వేరొకసాక్షికై పోవుచుండ నచ్చట నొక గుఱ్ఱపువాడు దేవిని ధ్యానించుచు నిలువబడి యుండుటంగాంచి, వానిధ్యానము పూర్తియగువరకును వేచి తదుపరి వానితో నిట్లనియెను.

"అయ్యా ! సాక్షిసంతకమొకటి జేసెదరా?

గుఱ్ఱ—ఎందులో. నన్నే బాధించెదరు. పూజారిచే వ్రాలుగొనుడు చాలును.

సూరి—ఆతనిగూడ ప్రార్థించెదను. ఇరువురుసాక్షు లుండవలయును.

గుఱ్ఱ—మీవంటివారు పిలువ కాదనలేను. సరియే-యని సహజముగ యుద్యానవనమున మోహిని సూరిదాసుల కేమి జరుగుచున్నదో దెలిసికొన కుతూహలుడయ్యె, నట్టి తనయాతురత నిసుమంత వెలిబుచ్చక కపటాన్నువర్తియై ప్రవర్తించుచుండెను. సూరిదాసుని ఆహ్వానముపై పూజారియు, గుఱ్ఱపువాడును యుద్యానవనమున కేగి రెండు కాగితముల పైని చేవ్రాలును జేసిరి. మోహినివ్రాసిన వాగ్దత్తలేఖ సూరిదాసుకు గాంచి యిసుమంత మందహాసము జేసెను. పిమ్మట వీరిరువురును వారిని సెలవిమ్మని వేడి పోవుచుండ సూరిదాసు డాసాక్షులకు ఒక్కొక్క సవరుచొప్పున బహుమతి నొసంగెను. సూరిదాసుడును మోహిని యొక్కొక గుఱ్ఱపుబగ్గీని రావించి కూర్చొని పోవుచుండ సూరిదాసు డా

మోహినిని యుద్దేశించి "రేపటియుదయమున నేడుగంటలకు మీభవనమున కలసికొనెద"నని చెప్పి బోయెను. కాల మధిక మగుటంజేసి గుఱ్ఱపువాడుసయితము తనదారి తాఁబోయెను.

---

## ఛాయాపత్రము.

### మూడవ ప్రకరణము.

రామారావుని యాజ్ఞానుసారముగ కృష్ణారావు మరునాటి మధ్యాహ్నమున మూడుగంటలకు రామారావుగృహముఁజేరి, యజమానునిరాకకై నిరీక్షించుచుండెను. సాయంతన మారుగంటలు కొట్టెను. రామారావునిజాడ యేమియు గానరాలేదు. కృష్ణారావుమాత్రము చాల పట్టుదలతోనుండెను. రామారావు యెచ్చటికిపోయినను, యింటికి రాత్రివచ్చెదనని సేవకునితో చెప్పి, కృష్ణారావువచ్చిన, తనకై వేచియుండవలసినదిగా, తనయభిప్రాయము వెలిబుచ్చినందుల కీకృష్ణారావు వేచియుండెను. ఇదిగాక కార్యసానుకూలతకు రామారా వెట్టియుపములు పన్నునో తెలిసికొన కుతూహలుడై యుండెను. ప్రస్తుతకార్యమును మించియున్న విషయముల యందు బనిచేసి యుండియు, నూతనఫక్కిగా దోచుచున్న యీకార్యమున మననిరూపకుని శక్తియుక్తులు తప్పక దెలిసికొన నిచ్ఛగించుకొనుచుండెను. మననిరూపకు డపూర్వమేధా

శాలి, దేశమున నతనిమించినవా రుండరనియే భావింపవలసి యున్నది. గాన రామారావుని ప్రతిపథమునందును కృష్ణారావు నేర్చికొనదగినవిశేషము లనేకము లుండవచ్చును. అందుచే కృష్ణారావు, ఎంతయాలస్యమయినను కూర్చొనియుండ నిచ్ఛగించెను. రాత్రి యేడుగంటలసమయమున కొక గుజ్రాతువాడు వికారమగు దుస్తులతో నిలు ప్రవేశించెను. కృష్ణారావు రామారావుని నిరుపమానవేషధారణకు, పాత్రపోషణకు చిరపరిచితుడే యయ్యును, మూడునాల్గు నిముసముల వరకును ఆ నూతనాగతుని తదేకదృష్టితో జూడనిదే, ఆవచ్చు వ్యక్తి 'రామారా'వని జోల్చికొనలేకపోయెను.

రామారావు గది ప్రవేశించి వికారదుస్తులవీడి, నింతదనుక కృష్ణారావును వేచియుండజేసినందుల కాతని క్షమాపణ వేడి యాతని భోజనమున కాహ్వానించెను. గాని కృష్ణారావు భోజనము చేయనని చెప్ప రామారావు భోజనమున కేగి అయిదునిముసములలో మరలివచ్చెను. అటుపిమ్మట వారిరువురును కాగల కార్యమునుగూర్చి విచారించిరి.

కృష్ణా—అయ్యా! నేటి విశేషములెవ్వి?

రామా—విశేషములు జెప్పమొదలిడుటకుఁ బూర్వము నే నెచటికేగియుంటినో నీవు తెలిసికొనజాలితివా?

కృష్ణా—ఆగ్రాకు- 330 నెంబరు యింటికి-

రామా—అవును మోహినిని కనుగొంటిని. కొన్ని యేర్పాటులుగూడ జేసివచ్చితిని.

కృష్ణా—అవి యెవ్వి?

రామా—చెప్పెదను. వేకువనే అయిదుగంటలకు మనమిరువుర మటకుబోవలసియున్నది. నీవు నాకు చేయూత యొసంగవలసియున్నది. పిస్తోలును మాత్రము పట్టుకొని యుండుము. అవసరమువచ్చిన యుపయోగించవచ్చును. నీవు నాతోవచ్చి నే జేయమనిన కార్యము నిర్భయముగ నొనరింప వలయును.

కృష్ణా—ఏమది.

రామా—చెప్పెదనుగాని నీవు నాతో రాగలవా?

కృష్ణా—అటులనే కానిండు గాని ప్రకృతివిరుద్ధమును, నాస్వభావవిరుద్ధమును, యగుకార్యము చేయుమని నియమింపరుగదా?

రామా—లేదు.

కృష్ణా—రాజకీయవిరుద్ధమై దండనపాత్రమైన పని గాదుగదా.

రామా—అట్టిప్రమాదమును లేదు.

కృష్ణా—చాలును. తప్పక వచ్చెదను. నే నొనర్పవలసినకార్యమును సెలవిండు.

రామారావంతట తా మోహిని యిలు జేరుటయు, సూరిదాసుని రాకయు, దేవీమందిరముచ్చటయు, సవిస్తరముగ కృష్ణారావునకు దెలియజేసెను. మన మిరువురము రేపు ఉదయమున అయిదుగంటలకు బయలుదేరి ఆరుగంటలు కొట్టకుండనే మోహినియిలు జేరవలయు. సూరిదాసు డామె గృహమునకు సరిగా న్నేడుగంటలకు వచ్చెదనని చెప్పి పోయి యుండెను.

కృష్ణా—పోయి....

రామా—తక్కిన పని నాయది. ఏమి జేయుదలచితినో, సద్దానికితగు వస్తుసామాగ్రిని జతపర్చెదను. నీవేమియు అధికపరిసంగములకు లోనుగాక, నన్ను మన్నించుచుండవలయును.

కృష్ణా—అయిన నేను పరస్పరముగ నుండవలసినదేనా ?

రాము—నీ వధికముగ నాకొరకుగా నేమియు జేయ నక్కర లేదు. ఈకార్యమున నాస్థితిని జూచి నీవు కొంచెము ఖేదపడవలసియున్నను అందుమాత్రము నీవు చేజేసుకొనవలసి యుండదు. కలవరమంతయు నన్ను లోనికి గొనిపోవుటతో సమాప్తి యగును. ఆపై నాలుగయిదునిముసములలో మోహిని కచేరిసావిడియందమర్చబడియున్న గవాక్షము తెరువ

బడును. నీవు మాత్ర మాగవాక్షము చేరువనే వేచియుండి నన్ను పరిశోధించుచుండవలయును.

కృష్ణా—తరువాత

రామా—నన్ను జాగ్రత్తమెయి గమనించుచుండవలయును. నీవట్లు అణుమాత్ర మేమరుపాటుకలిగెనేని నా శ్రమయంతయు వ్యర్థమ్మగుటకు సందియము లేదు. ఆగవాక్షమున నేను నీకగపడుచునే యుండెదను.

కృష్ణా—సరియే- తరువాత

రామా—నేను చేయియెత్తినతోడనే, నేను నీచేతి కిచ్చు వస్తువున కగ్నిరగుల్పజేసి, గవాక్షమువెంబడి లోనికి ద్రోచి "అగ్ని" "అగ్ని" యని పెద్దకేకయొకటి వేయవలయును. తెలసినదా ?

కృష్ణా—ఆవస్తువేదియో నాకిపుడిచ్చెదరా ? లేక రేపొసంగెదరా ?

రామా—ఏల! ఇపుడే గైకొమ్ము అని తన జేబు నుండి యొకవింతయగు సన్నని గడ్డిబెండ నొకదానిని దీసి కృష్ణారావున కందిచ్చుచు "ఇదియే! జాగ్రత్తగా దాచికొనుము. అగ్నిచూపినతోడన నియ్యది తగులుకొని బ్రహ్మాండమంతపొగ వచ్చును. వెంటనే లోనికి త్రోసివేయవలయును సుమా! అని చెప్పెను.

కృష్ణా—నే జేయవలసిన పని యింతయేనా? ఇంక నేమైన యున్నదా.

రామా—అంతియ - నీవట్లు జేసినతోడనే నటలున్న తదితరపరిజనముకూడ నెట్టివిచక్షణ జేయకుండనే నీ కేకను లేకెత్తజేసి పెద్దగొల్లు గావింతురు. అట్టితరి నీవెట్టి కాలయాపన మొనర్పక నారాజవీధి నొకటిమండపముదరిని నాకొఱకై యెదురుజూచుచుండవలయును. రెండునిముసములలో నిను గలసికొందును.

కృష్ణా—నీవిచ్చు గడ్డిబిండను దీసికొని అగ్నితగుల జేసి, మోహిని కచేరీ సావిడీ కమర్చబడియున్న గవాక్షముదరిజేరి నీవు చేయియెత్తినతోడనే నయ్యది లోనికి దోసి "అగ్ని" "అగ్ని" యని కేకవైచి, వీధిమొదట మంటపమునకు బోవలయు. సరికదా నాపని.

రామా—అవును. అంతపాటి జేసినజాలు.

కృష్ణా—నేనాభారమంతయు సంపూర్ణముగ వహించెదను. ఎట్టిలోపము నాపట్ల రానీయను.

రామా—చాల రాత్రియయినది. నీవిక బొమ్ము. వేనువను ఆలస్యముచేయకుమా-త్వరగా రావలయును.

కృష్ణారావు రామారావుని శెలవుగైకొని, గడ్డిబిండను సంగ్రహించి స్వగృహోన్ముఖుడయ్యెను, రామారావు శయనింపబోయెను.

# ఛాయాపరము.

## నాలుగవ పరిచ్ఛేదము

తూరుపున తెల్లవారెను. కొందఱు విద్యార్థులు త్వరలో రానున్న పరీక్షలకు, తమతమ గదులయందు దీపములు వెలిగించి చదువుకొనుచుండిరి. సంగీత విద్యాభ్యాసకులు తమతమ యిండ్లయందు పాడుకొనుచుండిరి. రాత్రియంత నిశ్శబ్దముగనుండిన బండ్ల రణగుణధ్వని కొంచెము కొంచెముగ హెచ్చు పెరుగుచుండెను. ఇట్టితరి ఆగ్రా రాజవీథి మొదటి మంటపముదరి యొకశకటము వచ్చి ఆగెను. అందుండి యిరువురు వ్యక్తులు బండినిదిగి అచ్చటనే నాబండినాపి యుంచవలసినదిగా బండివానితో జెప్పి కాలినడకను వీరిరువురును నియమితస్థలమునకుం బయనమైరి. వారా మోహిని భవనము జేరి జూచుసరికి వీథిద్వారము మూయబడి యుండెను. ఏడుగంటలాయెను. ఎనిమిది గంటలును కాజొచ్చెను. సూరిదాసు రాలేదు. భవనద్వారము తెఱువబడలేదు. అంత రామారావు మునుపటి గుఱ్ఱపువాని వేసమున తిరుగ గుఱ్ఱపుశాలదరికిబోయి వారితో నేమేమో ప్రసంగించి మరలివచ్చి కృష్ణారావుని గలసికొనియెను. ఇంకను వ్యవధియుండుటంజేసి కాబోలును వారిరువురు చర్చింప మొదలిడిరి.

కృష్ణా—ఇదియేమి? ఎనిమిదిగంటలు కావచ్చెను గదా, ఎవరును కానరారు.

రాము—నాకు నదియే సందియము దోప నిపుడే వెళ్ళియుంటిని. సూరిదాసునికి నిన్నరేయియే జ్వరమువచ్చె నట, ఆవర్తమానము మోహినికి చేరినతోడనే నాయమ సూరిదాసు జూడబోయినదనియు, తొమ్మిదిగంటలు కాకుండ, గనే నిలుచేరుననియు సమాచారము తెలిసికొంటిని. గాన మనమిక ఒకగంటకాల మిచ్చోటనే వేచియుండవలయును.

కృష్ణా—కాఫీ, కొంచెము త్రాగివచ్చెదమా?

రాము—నేను నదియే యనుకొనుచుంటిని. రమ్ము త్వరగా, మరలి రావలయునని కాఫీ ఓటేలు దెసజనుచు నిట్లు మాటలాడుకొనజొచ్చిరి.

కృష్ణా—మోహినికి బెండిలి యాయెననికదా చెప్పి యుంటిరి. యామాట యదార్థమేకదా.

రామా—అవును, వారివారి పత్రములలో నేనొక సాక్షిని. మరియు, మోహిని సూరిదాసుల వివాహము వలన మనకు కొంత కార్యభారము తగ్గినది.

కృష్ణా—అదియెట్లు వారివివాహము మన కార్యమున కెట్లుతోడుపడును.

రామా—మోహిని, సూరిదాసునితో యువరాజుని స్నేహమును గూర్చి నొకింత మరుగుపరిచి జెప్పి యుండవల

యును. యువరాజు, తనతో స్నేహము చేసియుండెనని యే చెప్పెనా, సూరిదాసు డామెనంతగా ప్రార్థింప నవసరముండను. అందుచే యువరాజామెను కోరియుండెననియు, ఆమె యందుల కంగీకరించెననియు, తరువాత నాతను తనను మోసపుచ్చినట్లును జెప్పియుండవలయు. అందుచే నాభార్యా పటమాతని కనుల బడనీయక యే మరుగుపరచి యుంచును.

కృష్ణా—ఔగాని, ఆపటమెట దాచెనో మనము దెలసికొను టెట్లు ?

రామా—కమల యెచ్చటికి బోయిన నచ్చటికీపటము దీసికొనిబో లేదు గదా. సులభముగ నన్నివేళల దీసికొని పోవుటకు క్యాబినేటుసైజు. ఇదిగాక మోహిని యిలువీడి బోవుచున్నప్పుడు రాజుగారు తనపరివారముచే రెండుసారులు దారిదోపిడి జేయించి యుండెననియు, రెండుసార్లును వృథా ప్రయాసమేగాని భార్యాపటము యొక్క జాడ కించుకైన లభ్యము కాలేదనియుగదా జెప్పెను. దీని నాధారముగా జేసికొని నాయమవెంట గొనిపోవుట లేదని స్పష్టపడును.

కృష్ణా—మరియెందున దాచియుంచును.

రామా—స్త్రీలోకము సాధారణముగా తమరహస్యములొరులతో జెప్పక నతిగూఢముగ దాచుదురు. ఇందు మరొక విశేషమున్నది అనతికాలమున ఆభార్యాపట ముప

యోగింపదలచి యుండుటంజేసి, ఎచ్చట దాచియుంచినను యీపాటికి యింటికి దెచ్చియుండవలయును.

కృష్ణా—అదేమియో నేను నమ్మజాలకయున్నాను, ఏలనన రాజుగారును కొలదిదినములకిత్రమునసే మోహిని యిల్లంతయు దొంగలచే కలయవెదకించియున్నారు. ఇంటనే యుండిన దొరకకపోవుట యేల ?

రామా—రాజునకుగాని, ఆదొంగలకుగాను ఎట్లు వెదుకవలయునో దెలసికొనలేక మోసపోయితిరని నాదృఢ నమ్మకము.

కృష్ణా—అట్టితరి మీరెటుల జూడగలరు.

రామా—నేనుజూడను. ఆమోహిని చేతనే చూపించుకొందును.

కృష్ణా—అందులకామె యంగీకరించక తిరస్కరించిన

రామా—అటు చేయజాలదు. చూచుచుందుము.

అని మాటలాడుకొనుచు కాఫీహోటేలునకేగి, కొంచెము ఫలహారములుగొని, కాఫీనిత్రాగి మరలిపోయి తమ నియమితస్థానమున మోహినిరాకకై యెదురుతెన్నులు జూచుచుండిరి. ఇంత నొకజోడుగుఱ్ఱములబగ్గి వచ్చి మోహినిభవనముముంగిట నిలువబడియెను. రామారావు కృష్ణారావుని చెవిలో "జాగ్రత్త" నీపనిని నేమరకుమా" యని చెప్పి బగ్గి దరిజేరబోవుచుండెను.

ఉదయము తొమ్మిదిగంటలు కాజొచ్చెను. ఎండ నొకింతతీక్షణముగ నేయుండెను. ఆపట్టణముమర్యాదప్రకారము బగ్గివచ్చి నిలచినతోడనే, బగ్గి తలుపును దెఱచి, అందుల కేమైన నామెయిచ్చిన గైకొనవలయునని పలువురు బిక్షుకులు పరువెత్తి వచ్చుచుండిరి. అందరునువచ్చి తలుపుదెఱచి బహుమతిగొనుటకై వారిలో నార్వురు తగవులాడికొనుచు తుదకు కొట్టుకొనప్రారంభించిరి. ఇదియే మంచియదనని మనకుఱ్ఱవాఁడు నానూకయందు జొచ్చి వీరిని మందలించుచు బగ్గిజేరి "హో చచ్చితి చచ్చితి" నని పెద్దకేకవైచి నేలబడియెను. ఎచ్చట నెంతబలమైనగాయము తగిలెనోగాని ముఖమునందే గాక, తనదుస్తులుకూడ రక్తపాతమై యతిభయంకరముగ దోచుచుండెను. సరి- నోటమాటమరిలేదు. కన్నులు మూతబడియెను.

ఈతని స్వరూపమును రుధిరమునుగాంచి భయాక్రాంతులై బిక్షుకులు కాలికిబుద్ధిజెప్ప మొదలిడిరి. కృష్ణారావు కేక వినియు ముందునకు నాలుగడుగులు వేసియు, మరల నేమి జ్ఞప్తికివచ్చుటనో గాని నటనే నిలువబడి చూచుచుండెను. మోహినియు నతియాతురమున భవనములోనికింజని కచేరి సావిడిజేరి మూర్ఛితునిదెస గాంచుచుండెను. ఇట్టియెడ వేరొక నల్వురుపురుషులు వచ్చి యీతని గాంచుచుండిరి. మోహిని

ఆమనుజులబిలచి జీవించియున్నాడా? అంతబలముగు గాయము దగిలెనా? యని ప్రశ్నించెను.

మనుష్యులు—చనిపోయిరని కొందరును-లేదు ప్రాణమున్నదని మఱికొందరును జెప్పి సిళ్లకై మోహినిని ప్రార్థించిరి. మోహిని యాతని లోనికింగొని తెమ్మని చెప్పి బ్రాందికొంచె మాతని గొంతుకయందు బోసెను మోహిని సర్వసాధారణము కఠినహృదయకాదు. అటు కాకపోయినను, యీగుజ్జువాడామెకు పరిచితుఁడిబోలె నగుపడుటనో, లేక, నిందాపాత్రురాల నగుదునను భయముననో గాని, ఆతని తెలివిదెప్పించి నెటులైన కాపాడవలయునను తలంపుతో నుండెను. తదితరపరిజనముతో కృష్ణారావు రామారావుని యాజ్ఞానుసారముగ గవాక్షముదరినే వేచియుంచి, తన పరమమిత్రుడగు రామారావు దుస్థితిని జూడలేక, ఆనాహ్వాయముగ చేజేసుకొనిన నెట్టి సంకటములు సంప్రాప్తముగునో యని భీతిలి, తన కార్యాచరణమునకై సంసిద్ధుడుగ నుండెను.

మూర్ఛితుడు నొకింత నిశ్వాసముదీసి, గాలికై వేదనబడుచున్నట్లు చేతులిట్టిటు గొట్టుకొనుచుండ, మోహిని యాజ్ఞానుసారముగ దాసి యా గవాక్షపు తలుపులదెఱచెను. తోడనే ఆమూర్ఛితుడు చేయినెత్త కృష్ణారావు తన గడ్డిబిండకు అగ్నినిచేర్చి నెవరును కనిపెట్టకుండ కిటికిగజముల వెంబడి లోనికి విసరి "అగ్ని" "అగ్ని" యని కేకలు వేసెను.

మోహిని భవనము వెనుకభాగమునగూడ నత్యధికముగ పొగ వచ్చుచుండెను. భవనమంతయు పొగగ్రమ్మెను. ఇదియేమి విపరీతమని నచ్చటనున్నకొందరు మోహినితోఁబాటు తహాతహబడుచుండిరి. భవనము దహనమగుచున్నదని నలిక్కులనుండియు కేకలు వినబడెను. కృష్ణారావుని "అగ్ని" కేకను నటనున్న నల్వురును ఏట్టిచిదక్షణ్కలేకయే "అగ్ని" "అగ్ని" యని పెద్దకేకలు వేయమొదలిడిరి.

మోహిని, భయోత్పాతమున తనగది కెసకు పరుగిడెను మనగుఱ్ఱపువాడు మూర్ఛబోయినది. కన్నులు దెఱచెను రెండునిముసలట్లుజూచుచు, పరుండియుండినసీవ్యక్తి లేచి భయము వలదు. అమ్మా! భయములేదు. నేవరోభవనము వెనుకటి భాగమున పనికిరాని గడ్డినిమున్నగు వస్తువులను తగులబెట్టుచుందురు. అంతియకాని, భవనమగ్నిచే కాల్పబడుచున్నదనుమాట సత్యము కానోప దనెను. కృష్ణారాపదివరకే రామారావు పూర్వపుఆజ్ఞానుసారముగ నాగాజవీధి మొదటి మంటపముదరిజేరి వేచియుండెను. రామారావు కొంతకష్టము సూచించుచు వేచి మోహినిచేసిన యుపకారమునకు మెచ్చుచు, శ్రమయిచ్చినందులకు క్షమాపణ వేడికొనుచు శెలవుగైకొని నిలువీడెను.

# — ఛాయాపత్రము —

## అయిదవప్రకరణము.

రామారావట్లు మందగమనమునవచ్చి తనకై మొదటి మంటపముదరి వేచియున్న కృష్ణారావునుగలసికొని, తమరాకకై నచ్చోట సిద్ధపరచియుంచబడిన శకటమునదిరోహించి త్వరగమనమున స్వగృహోన్ముఖులైరి. రామారావుని అద్భుత చర్యయంతయును కృష్ణారావున కగమ్యగోచరముగ నుండెను. విషయమును కనుగొనవలయునను ఆతురత హెచ్చగుచుండెను. రామారావుని ముఖకళలయందు సంతోషచిహ్నము దోచుటంజేసి గార్యము సానుకూలపడినట్లుమాత్రము కృష్ణారావు గ్రహింపగలిగెను. గాని ఏయుపాయమున మోహినిని వశపరచుకొనగలిగెనో దెలిసికొనజాలక, తానుప్రశ్నింపకయే రామారావు చెప్పునను సంకల్పమున నుండెను. ఇంతలో నాశకటముఆగెను. వీరిరువురును బగ్గీదిగి, వానికీయవలసిన అద్దెనుయిచ్చి యిరువురును గృహము జొచ్చిరి.

రామారావు కచేరి సావిడి యందున్న వాచీ టంగు టంగుమని పది గంటలు కొట్టెను. కృష్ణారావు గదిజొచ్చి వాలు కుర్చీపైకూర్చొనెను. రామారావుమాత్రము గుజ్జువాని వికారదుస్తుల వీడి స్నానమాడి, పరిశుభ్రముగు వలు

Sree Bala Saraswathi Grandhalayam



వలధరించి కృష్ణారావుదరినే వేరొక వాలుకుర్చీపై కూర్చొని పరిసంగించుకొనిరి

రామా—మిత్రమా! మన కపట నాటకరంగమున నీవుమాత్రము నీపాత్రను మిగుల ప్రశంసనీయముగా బ్రదర్శించితివి నీవింతవరకు చేయగలుగుదువని నేననుకొనలేదు సుమా. నీవుతక్క మరి వేరెవ్వరయిన యీకార్యము బూనుకొని యున్నచో కార్యభంగమయి వుండును. సంశయము లేదు.

కృష్ణా—(వెల వెల బోవుచు) ఏమి? పొరబడితినా కార్యము ఫలింపలేదా?

రామా—నీవు పొరబడలేదు నిజముగ నీవు ప్రశంసాపాత్రుడవే. ఇందబద్ధ మేమియును లేదు. కార్యము జయమంధినది.

కృష్ణా—ఛాయాపటము దొరికినదా?

రామా—ఏల?

కృష్ణా—మరియేమి దొరకెను.

రామా—ఆపట మామె ఎట దాచియుంచెనో తెలసుకొంటిని.

కృష్ణా—అది ఎట్లు?

రామా—నేను నీకింతకు పూర్వము జెప్పియుండ లేదా. ఆమెయే తన చేతులార చూపించెను.

కృష్ణా—నీమాటలు నా కర్థమగుట లేదు సవిస్తరముగాఁ దెలియజేయ బ్రార్థించెదను.

రామా—అట్లయిన వినుము. ఇయ్యది చాల స్వల్ప విషయము. ఆవీధియందు నేను నేలబడినప్పుడు నావద్దవుండిన నల్వురను నాయత్నజ్ఞకు లోబడియున్నవారని తెలసికొంటివా?

కృష్ణా—సరియే. అటులనే కానిమ్ము.

రామా—బిక్షుకుల పోట్లాటయందు జోక్యము కలుగ జేసికొని, ముఖము దుస్తులు రక్తమయమునం దోపజేయు నటుల, నా యఱచేతియం దెఱ్ఱని రంగును సంగ్రహించి, నయ్యది యుపయోగించియే నాకు గాయము తగిలినట్లును, అందుచే మూర్ఛితుడనయి పడినట్లును దోపజేసితిని. ఇది యదార్థమనుకొని, పాపమా మోహిని నన్ను లోనికిం గొనిపోయి సావిడి యందొక బల్లపై పరుండబెట్టి బ్రాందిని కొంతను గొంతునబోసెను. ఇటు జరుగునని నే నెఱింగియే నిన్ను జోక్యము కలుగజేసికొనగూడదనియు, కలవరమంతయు నన్ను లోనికి గొనిపోవుటలో నంత మొందుననియు నీకు జెప్పియుంటిని.

కృష్ణా—ఇది సరియే. మోహిని యిందునీకు పటమెట్లు జూపించెను.

రామా—నన్ను లోనికిం గొనిపోయి పరుండజేసిన పైని నేను గాలికై కొట్లాడురీతి, చేతులిట్టటువేయ, మోహి

నిమ్మే ఆగవాక్షము తెరువ దాసి నాజ్ఞాపించెను. అపుడుగదా నేను చేయి యెత్తుటయు, గజముల వెంబడి నాబిండను లోనికి నీవు ద్రోచి "అగ్ని" యని కేకవేయుటయుజరిగెను.

కృష్ణా—అవును. ఇయ్యది నీకార్యమునకేరీతి సాహాయ్యభూతమయ్యెను.

రామా—ఈఒక్కటియేకాదు. భవనము వెనుకభాగమున కొంతగడ్డియు సమకూర్చి నేనులోనికి గొనిపోయిన రెండుమూడునిముసములకు నద్దానికి అగ్నిని చేర్చుమని యంటిని భవనము దహనమగుచున్నదని ఎల్లరు తలంచిరి. అదియే నాకు కావలసినది. ఎట్లన ప్రపంచమున మానవస్వభావము కొన్నివేళలయందు విపరీతముగ నుండును. అందును స్త్రీల చిత్తవికారము లత్యధికముగనుండును. ప్రాణావసానకాలమందును గత్యంతరములేనిక్లిష్టసమయములందును, విషమావస్థయందును మానవస్వైజశక్త్యాతీత అద్భుతకార్యములు చేయుదురు. ఇయ్యది ఎల్లరకు అనుభవపూజ్యమే? మోహిని స్త్రీయయ్యును నాగరికతగలిగిన మేధావతి స్త్రీలు సాధారణముగ, తమతమ వాసములు అగ్నిచే దహింపబడుచున్నతరి, తామే వస్తుసముదాయ మత్యధికముగ ప్రేమించి గౌరవించుచుందురో నద్దానిని ప్రప్రథమమునయింటినుండి వెలుపలికి దీయ యత్నింతురు. ఇట్టి సహజగుణము మాన్పగాని మరల్పగాని ప్రయత్నించుట దుస్తరము. నేనీరీతియుక్తినే మున్నొ

కసారి యుపయోగించి జయము గాంచితిని. పెండిలియయి బిడ్డలుగన్న తల్లి అట్టియెడ తనసంతానముకొరకు పరుగిడును. అవివాహితయగు జవ్వని తన నగలపేటికకై గంతులిడును, మనకథానాయికయగు మోహినిపట్ల చెప్పిన నిర్బంధము లేవియు లేనందున తనప్రాణమునకుమించి ప్రేమించుచు నేదియో గొప్ప ఆస్థినిసంపాదింపనెంచుచున్న యీఛాయా పటము కొరకే పరుగిడును, అప్పుడాభవనము కాలిపోవుచున్న దను కేక మిగుల అద్భుతముగ రేకెత్తబడెను. ఆకేక విని నచ్చటి జనులు దిదృక్షులు, భయము సూచించుచు పరుగి డిరి. అప్పుడే మోహినియు, తనగదిదెసబోయి, తనపడక మంచము తలదెస నమర్చబడియున్న నొక మీటనొక్కి ఛాయాపటము దీయప్రయత్నించెను. చాయాపటముయొక్క కొంతభాగము నేను గాంచితిని. మోహిని ప్రవర్తననే నతి జాగరూకతతో పరిశీలించుచుంటినని మాత్రమునమ్మవలయు తోడనే, "అగ్ని" యను కేక నిజముయినను, భవనము అగ్ని సంస్కారము కాలేదని ధైర్యముజెప్పినతోడనే నాబాల మర ల నాపట మచ్చోటనే నేరును జూడకుండ దాచి నీవలకు వచ్చెను. ఆమె చూడకుండనే ఆగడ్డికట్టనుదీసి నావల త్రోచి లేనిపోని క్షమాపణలు జెప్పి వీథిబడితిని. ఆపటము నేను చూచినతోడనే గ్రహింపబూనితినిగాని, ప్రేక్షకులు నన్ను వీడక జూచుచుండుటవలనను, అప్పుడేగైకొనిన కొన్నిచిక్కులు

రాగలవనినమ్మి రసభంగమగునని యెంచి, మిన్నకనిను జేరితిని.

కృష్ణా—ఇపుడేమి చేయదలంచిరి. మనపరిశోధన ముగిసెను. చాయపట మూరాజునకు నొప్పగించు భారము మాత్రము మనయందున్నది. పటమెచ్చట దాచియుంచబడెనో తెలిసికొంటిమి. గాన నేటి మధ్యాహ్నమే కాశీయందున్న కుమార్ చంద్ర్ పేర తంతినిచ్చి త్వరలో నాతని రప్పింపవలయు. ఆతనిపట మాతనిచేతనే దీసికొనజేయ దలంచితిని. మన ము వ్వురమును రేపటి ప్రాతఃకాలముననే ఎనిమిదిగంటల కటకు బోవలయును. మోహిని, సుమా రాగంటకే నిలువీడి మరలి తోమ్మిది లేక పదిగంటలవరకు రానేరదు. ఆమె యింటలేని సమయమున మనముబోయిన, దాసిచే మనము లోనికి బిలువ బడుదుము. అంత దాసికేదైన నొకపనిని గల్పించి ఆపటము గ్రహించవలయు. ఇంకను రాజుగారు తమ స్వహస్తములతో తిరుగ నాపటము గ్రహించుట యుత్తమకార్యము కాదా?

కృష్ణా—అటులయిన యేగంటకు రేపు నన్ను రా నియమించెదరు?

రామా.—ఉదయ మేడుగంటలకుబూర్వము.

కృష్ణా—తంతియో-

రామా—నేడు నే నిచ్చెదను.

కృష్ణా రావాతని శలవుగైకొని భోజనమునకు స్వగృహ మునకుం బోయెను.

# ఛాయాపత్రము.



## ఆఱవ ప్రకరణము.

రామారావును భోజనముచేసి కాశీనగర కుమార్ చంద్ పేరిట 'తడవుచేయక రమ్మని' తంతి నిచ్చి కించుక విశ్రమించెను. అధికశ్రమకు లోనుగాకనే కార్యము జయముగాం చెనుగదా యనుతృప్తిచే రామారావు గాఢనిద్రాపరవశు డయ్యెను. మరునాటి యుదయముననే సుమారు, నాలుగు గంటలకు కుమార్ చందు రామారావునిగృహ మలంకరించెను. రామారావప్పుడే మేల్కాంచి తన ప్రాతఃకాల తేనీరును త్రాగుచు నేదియో దీర్ఘాలోచనము చేయుచుండెను. కుమార్ చందునిరాక దెలసిన తోడనే బోయి, నాతని సవినయముగా లోనికి దోడ్కొనివచ్చెను. చందాతని గాంచినతోడనే యానన మున ఆనందముదోప నిహూపకుని నిట్లు సంబోధించెను.

చంద్ గారు—అయ్యా, పటమును సంపాదింపగలిగి తిరా?

రామా—లేదు. మీరే ఆపటమును గ్రహింపవల యును.

చందు—అదు యెట్లు.

రామా—మార్గము దెలిపెదను.

చందు—అయ్యది మనకు లభించగలదను నమ్మక మున్నదా ?

రామ—తప్పక లభించగలదు.

చందు—ఎప్పుడు.

రామా—ఇప్పుడే. కృష్ణారావు వచ్చినవెంటనే మన మటకు బోవలసియున్నది. దాని కేమిగాని మోహినిపెండ్లి మీకు దెలసినదా ?

చందు—మోహినియా- పెండ్లి- ఎప్పుడు.

రామా—నిన్నటిదినముననే, దేవీమందిరమున. సూరిదాసుడను న్యాయవాదిని పెండ్లియాడెను.

చందు—నే నమ్మజాలను. ఒకవేళను పెండిలిజేసికొనినను సూరిదాసు నీమె ప్రేమించదు.

రామా—అటుగాదు. ప్రేమించితీరును. అట్టితరి నీకెట్టిభయమునుండగూడదని నాదృఢసంకల్పము. మోహిని యదార్థముగ సూరిదాసునే ప్రేమించుచున్నయెడ మిమ్ముల నింక ప్రేమింపదు. అటుల మిమ్ము ప్రేమింపక మీపైఆసయే వదలుకొనిన పక్షమున, మీ వివాహవిషయమునగాని లేక ఆ పటము పంపువిషయమునగాని నెట్టి జోక్యముకలిగించుకొనదు. గాన మోహిని వలన నింక మీకెట్టి ప్రమాదమును యుండ నేరదు.

అనుచు వీరిరువురు సంభాషించుకొనుచుండగనే కృష్ణారావు వచ్చెను. అంత రామారావు కృష్ణారావులును కుమార చంద్రయును నొక మోటారులో ఆగ్రాకు పయనమై ఏడు గంటలకు మోహిని భవనము జేరిరి. అంత మోటారును ఆపి ముగ్వురును దిగి మోహిని భవనము దెసబోయిరి ఆ భవన ద్వారముదరి నొక ముసలి దాసి నిలువబడి నూతనాగతుల నాపాదమస్తకము వరకును పరిశోధించి కొంచెము ముందు నడచి వచ్చుచున్నవ్యక్తి నుద్దేశించి "అయ్యా! తమరు రామారావు గారై యుందురా" యనియెను. రామారావు 'అవు' నని ప్రత్యుత్తర మొసంగి, మోమున భయాశ్చర్యములుదోప నా ముసలిని గాంచుచుండెను. అంత నామె "అయ్యా" సరిగా బోల్చగలిగితిని. మునుపటి గుఱ్ఱపువాని వేసమున మీ రిపుడు లేనందున నించుక సంశయించితిని. నాయజమానురాల గు మోహిని మీ గుర్తుల జెప్పి, నేడిటవత్తురని జెప్పి నేటి యుద యముననే అయిదు గంటలకు నిల్లువీడి తనభర్తతో గలసి ఏటకో బోయెను. తిరుగ నింతలో రాజాలనని చెప్పెను.

ఈమాటలు చంద్రు వినినతోడనే మోము వెలవెల బోయెను. పెద్దనిట్టూర్పొకటి విడిచెను. రామారావంత నా దాసితో నిట్లుసంభాషించెను.

రామా—ఆ దేశమే విడిపోయెనా ?

ముసలిది—అవును. మంచము కుర్చీలు టేబిలు తప్ప తక్కిన వస్తుసామగ్రియంతయు దీసికొని యిలుపేడిను.

చందు—కాగితములలో పటమో?

ముసలిది—నాకు తెలియదు.

రామా—సరియే. నిన్నటకు వచ్చిన గుఱ్ఱపువాడు కొన్ని కాగితములనిట మరిచిపోయెనట. ఆకాగితములకుగాను వచ్చితిమి. ఎచ్చోటనైన పడియుండునేమొ వెదుక గలవా?

ముసలిది—మీరే చూచుకొనుడు. నాకు తెలియదు.

రామారావందులకు వల్లెయని లోనికేగెను. చందును కృష్ణారావుయు వాకిటనే నిలచియుండిరి. మోహిని గదిజేరిన తోడనే అటనున్న సామగ్రి నిట్టటు త్రోయబడియుండెను. మిగుల ఆతురముగ ఆందోళనాభయములచే నిలుపేడినట్లు స్ఫురింపజేయుచుండెను కొన్నికాగితములుచించి నట వేయబడి యుండెను. రామారావు అధమముగ నాగది జేరి. పడకమంచపు తలదెసనున్న మిాటను, తొలుత మోహిని దీసిన రీతినే దెర చెను. అందు ఛాయాపటమును నద్దానికి జేర్పబడియే రామారావుపేర విలాసము వ్రాయబడిన యొక లేఖయు గాం చెను. రామారా వీపటమును లేఖయు జూచి, మందహాసము గావించెను. అంత నాపటమును, లేఖయు చేగొనెను. ముఖ కళలు మారెను. ఆఛాయాపట మెవరిది- లేఖ నెవరు వ్రాసి రి—దివ్యసుందరలలామ, జగన్మోహనావతార- నవయౌవన

శోభాపరిపూర్ణయగు మన కథానాయిక మోహినిది. లేఖ యో నిరూపకాద్యక్షుడగు రామారావునకు జగన్మోహిని యగు మోహినివ్రాసిన లేఖ. ఆలేఖ నంత రామారావు దీసి నీక్రిందివిషయముల జదివెను.

ఆగా౯- బుధవారము.

రాత్రి గం. 4 లు.

అప్రతిమాన మేధాశాలియగు రామారావుగార్కి విధేరాలు మోహిని సవినయ నమస్కారములు త॥

మీ కుశాగ్రబుద్ధికి నే నత్యానంద మొందితిని. మీ నిరుపమాన పాత్రధారణవలన నన్ను మీరు సంపూర్ణము లోబరచుకొంటిరి. మీవంటివారి నెదుర్కొన నేనెంతటిదానను. అగ్నిప్రమాదమని కేకవేయబడిన తరువాత, ఆ కేక కల్ల యని చెప్పి మీరు నన్ను క్షమాపణలు వేడి యిలు వీడు వరకును మీయం దెట్టియనుమానమును నాకు దోచలేదు. తదుపరి మీయుక్తిని నేగ్రహించి యీవిషయమున నామందబుద్ధికి నేనే చింతిల్లితిని. రాజుగారగు కుమార్ చందుగారొక ప్రతినిధిని యీవిషయమున నియమించియున్నారని దెలసిన తోడనే ఆప్రతినిధి మీరైయుందురని నేనూహింపగలిగితిని మీవలన నాకెంత ప్రమాదము సంభవించునని పలువురు నన్ను బెదరించిరి. మీవిలాసముకూడ నాకీయబడెను. ఇన్ని దెలసియుండియు మీరు వచ్చినప్పుడు నే జేసిన కార్యమును

విచారించి మీమోము మరలజూడ సిగ్గుచే నీలేఖామూల ముగ నామనోభావముల వ్యక్తీకరించుచున్నాను. మీరుకోరిన పటమును, నాచేతనే మీరు చూపించుకొనుటయందే మీ బుద్ధివిశేషము తేటబడుచున్నది. నాకు పురుషవేషము క్రొత్త దిగాదు. నే నెన్నియోసారులు పురుషవేషముతో ప్రవర్తించి యుంటిని. మిమ్ములజూచి రమ్మని నాబానిసను మీగృహము నకు రెండుసారులు బంపియుంటిని. గాని ఆమె మిమ్ము జూడ జాలకపోయెను. నేను పురుషవేషముననే మీయేర్పాటులు దెలిసికొన నిచ్ఛగించి వచ్చితిని. గాని విఫలమనోరథురాల నైతిని. ఇక నిటనుండిన మీవలనగాని, రాజుగారివలనగాని, ప్రమాదములు రావచ్చునను తలంపుతో నాకు వేరొకతెన్ను దోఁచకక యిప్పుడు మే మిరువురము దేశమువీడిపోవ నిశ్చ యించితిమి. మీవంటి సుప్రసిద్ధనిరూపకాధ్యక్షుని చేతిలో నే నెంతదానను. ఇప్పుడు గాకపోయినను వేరొకప్పుడైనను యీ పటములు మీరు గొనకమానరు. నేనును పెండ్లిచేసికొనియుం డుటంబట్టి ఆఛాయాపటము నాయింటియందు నుండ ముప్ప నియు నెంచి సగౌరవముగ నాపటమును మీవిలాసమునకే నిన్నటిమధ్యాహ్నమున బంపితిని. ప్రథమమున యీపట

మా రాజుగారికే పంపదలంచియు పటమును గ్రహించి నాపై తా నెట్టిచర్యలు చేయునో యని మరల శంకించి మీపేర బంపితిని. ఈపట మాతని కందజేయుటకు బూర్వము తమరొక చిన్నకార్యము నాకొరకై జేయ ప్రార్థించెదను. నాకు బదులు తమరీపట మాతనికిచ్చి కుమార్ చందుగారు నాపట్ల యెట్టి దారుణచర్యలు దీసి జరుపకుండ నొకలేఖ యాతని చేవ్రాలుతో మీరు గ్రహించి మీయధీనములోనే యుంచగోరెదను. అందుల కాతడు సమ్మతింపకపోయెనా నేను మరల మీ సాహాయ్య మపేక్షింపవలసివచ్చునని తమరు గ్రహింపవలసి యున్నది. ఇటుపై రాజుగారు సుఖనిద్ర జెందవచ్చును. ఇందుతో జతజేసిన నారూపపట మాతనికి నాస్మరణచిహ్నముగ నుంచ గోరుచున్నానని నాప్రార్థనగా రాజుగారితో సెలవీయ మిమ్ముల గోరుచున్నాను శ్రమకు క్షమించవలయు. శెలవు.

విధేయురాలు

మోహిని.

రామారా వీయుత్తరమంతయు జాగ్రత్తగా చదివి మోహిని సుగుణముల నెన్నుకొనుచు వాకిట వేచియుండిన

కుమార్ చందుగారికీ లేఖను మోహిని రూపపటము నొసంగి తాను కోరు పట మింటనున్నదని చెప్పి నచ్చోటువాసిరి.

వీరు యిలు జేరుసరికి రామారావుని పేర నొక రిజిష్టరు చేయబడిన బంగీ వచ్చియుండెను. దానిని గైకొని కుమార్ చందుగారికొసంగుచు నిట్లుజెప్పెను.

అయ్యా! తమ ఛాయారూపటమిది గైకొనుడు. గాని మోహినిపై నెట్టి చర్యను తాము గడంగకుడు. అటుల నామాట మన్నించక వేరుమార్గము దొక్కి రేని మీకు ప్రతికూలముగ బనిచేయువలసివచ్చునని మాత్రము స్పష్టముగా జెప్పవచ్చును. మోహిని మీవద్ద నొక లేఖ వ్రాయించి పుచ్చుకొనియే యీపటము మీ కధీనము జేయుమని లేఖ యందు వ్రాసియుండెరుగాని, నాకు మీయందెట్టియనుమానము లేదు ఇక మోహిని రూపపటమునుగూర్చి జెప్పవలసియున్నది. ఈ పటము మీరు కోరిన యిచ్చువాడనే గాని, యియ్యది మీరు యుంచెదగదు. మీకు రాజ్యమువచ్చినప్పుడు మాత్రము నా పారితోషికమునూట మరువకుడు. మీవివాహము నిర్విఘ్నముగ జేసికొనుడు.

రాజు—మహాశయా! మీశ్రీమకు నామనఃపూర్వక వందనశతంబులు. నేను మాటయిచ్చి దప్పువాడను గానని మాత్రము నమ్మియుండవలయును. నేనిలు జేరినవెంటనే కొంత సొమ్ము పంపించెదను. అనుగ్రహింపుడు. ”

అని శలవుగొని పట్టముబట్టుకొని వెడలెను. కృష్ణారావు కూడ నాతని శలవును గొని, తన నిజకార్యములుజూచుకొన నింటికి బోయెను.

సమాప్తము.



శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమండ్రి.

ఈదిగువపుస్తకములన్నియు నొకేసారి కొ...

లసీరామాయణము రు 1 కు ఇయ్యబడును.

| | | |
|---|---|---|
| తులసీరామాయణము | భా॥ న్య | ! |
| అభినవబర్త్రుహరి | ,, | 0 |
| రసపుత్రజీవనసంధ్య | ,, | 0 |
| ప్రతిజ్ఞాచాణక్యము | ,, | 0 |
| జయవిజయము | ,, | 0 |
| పద్మనాయకవిక్రయము | ,, | 0 |
| వైకుంఠమతము | మ॥ వెం | 0 |
| కామాక్షిసరసము | ,, | 0 |

వలయువారు—వేగుచుక్క గ్రంథమా

(బ్రాంచి) రాజమ

త్వరలో వెలువడును! గమ

# ప్రతాపదౌర్జన్యము.

భయంకరనారీపిశాచి మొదలయినవివ్రాసి ఖ్యా
సిన వాడ్రేవు మల్లపరాజుగారిచే రచియింపబడినది.
దీని ఆనందింపవలయునేకాని వ్రాయనలవికాదు. వల
యునాక్రిందిచిరునామాకు వ్రాసిన బడయుగలరు.

శ్రీ గణపాటి ధనరా జ

నన్నయగ్రంథమాల.